# అథ సప్తదశో%ధ్యాయః

# విష్ణుజలంధర యుద్ధము

సనత్కుమార ఉవాచ|

అథ దైర్యా మహావీర్యాశ్శూలైః పరశుపట్టిశైః | నిజఘ్ను
స్సర్వదేవాంశ్చ భయవ్యాకుల మానసాన్ || 1

దైత్యాయుధైస్సమావిద్ధ దేహా దేవాస్సవాసవాః | రణాద్విదుద్రువు
స్సర్వే భయవ్యాకుల మానసాః || 2

పలాయన పరాన్ దృష్ట్వా హృషీకేశస్సురానథ | విష్ణుర్వై
గరుడారూఢో యోద్ధుమభ్యాయ¸° ద్రుతమ్ || 3

సుదర్శనేన చక్రేణ సర్వతః ప్రస్ఫురన్ రుచా | సువోభితకరాబ్జశ్చ
రేజే భక్తాభయంకరః || 4

శంఖఖడ్గ గదా శార్ఙ్గ ధారీ క్రోధసమన్వితః | కఠోరాస్త్రో
మహావీరస్సర్వయుద్ధ విశారదః || 5

ధనుషం శార్ఙ్గ నామానం విస్ఫూర్య విననాద హ | తస్య నాదేన
త్రైలోక్యం పూరితం మహతా మునే || 6

శార్ఙ్గని స్సృత బాణైశ్చ దితి జానాం శిరాంసివై | చకర్త భగవాన్
విష్ణుః కోటిశో రుట్ సమాకులః || 7

సనత్కుమారుడిట్లు పలికెను -

అపుడు మహావీరులగు రాక్షసులు భయముతో కల్లోలపడిన
మనస్సు గల దేవతల నందరినీ శూలములతో, గొడ్డళ్లతో,
పట్టిశములతో హింసించ మొదలిడిరి (1). రాక్షసుల
ఆయుదములచే కొట్టబడిన దేహములు గల ఇంద్రాది దేవతలు
అందరు భయముచే కల్లోల పడిన మనస్సులు గలవారై
యుద్ధరంగమునుండి పరుగులెత్తిరి (2). ఇంద్రియములకు
ప్రభువగు విష్ణువు పారిపోవుచున్న దేవతలను గాంచి గరుడుని

అధిష్ఠించిన వాడై వెంటనే యుద్ధమునకు ముందునకురికెను (3). భక్తులకు అభయమునిచ్చు విష్ణువు అంతటా ప్రకాశించే కాంతులు గల సుదర్శన చక్రముతో విరాజిల్లు, పద్మము వంటి హస్తము గలవాడై ప్రకాశించెను (4). శంఖమును, ఖడ్గమును, గదను, శార్ఙ్గమను ధనస్సును ధరించిన వాడు, బయంకరమగు అస్త్రములు గలవాడు, మహావీరుడు, అన్ని విధముల యుద్ధమునందు నిపుణుడు అగు విష్ణువు మిక్కిలి కోపించెను (5). విష్ణువు శార్ఙ్గధనస్సుపై బాణము నెక్కుపెట్టి సింహనాదమును చేసెను. ఓ మునీ! ఆ గొప్ప నాదముచు ముల్లోకములు నిండెను (6). దుఃఖముచే కల్లోలమైన మనస్సు గల విష్ణుభగవానుడు శారఙ్గధనస్సు నుండి బయల్వెడలిన బానములతో కోట్ల సంఖ్యలో రాక్షసుల తలలు తెగవేసెను (7).

అథారుణామ జ జవ పక్షవాత ప్రపీదితాః | వాత్యావివర్తితా దైత్యా బభ్రము ః ఖేయథాఘనా ః || 8

తతో జలంధరో దృష్ట్యా దైత్యాన్ వాత్యాప్రపీడితాన్ | చుక్రోధాతి మహాదైత్యో దేవబృందభయంకరః || 9

మర్దయంతం చ తం దృష్ట్యా దైత్యాన్ ప్రస్ఫురితాధరః | యోద్ధు మభ్యాయ¸° వీనో వేగేన హరిణా సహ || 10

స చకార మహానాదం దేవాసురభయంకరమ్ | దైత్యానామధిపః కర్ణా విదీర్ణా శ్రవణాత్తతః || 11

భయంకరేణ దైత్యస్య నాదేన పూరితం తదా | జలంధరస్య మహతా చకంపే సకలం జగత్ || 12

తతస్సమభవద్యుద్ధం విష్ణు దైత్యేంద్రయోర్మహత్ | ఆకాశం కుర్వతో బాణైస్తదా నిరవకాశవత్ || 13

తయోశ్చ తేన యుద్దేన పరస్పరమభూన్మునే | దేవాసురర్షి సిద్ధానాం భీకరేణాతి విస్మయః || 14

అపుడు గరుడుని రెక్కల వేగమునుండి పుట్టిన గాలిచే పీడను పొందిన రాక్షసుల తుఫాను లో మేఘములవలె ఆకాశములో పల్టీలు కొట్టిరి (8). అపుడు మహారాక్షసుడు, దేవతల సమూహములకు భయమును గొల్పువాడు అగు జలందరుడు పెనుగాలిచే దుఃఖితులగుచున్న రాక్షసులను చూసి మిక్కిలి కోపించెను (9). రాక్షసులను సంహరించుచున్న విష్ణువును గాంచి కోపముతో వణకుచున్న అధరము గల వీరుడగు జలంధరుడు విష్ణువుతో యుద్ధమును చేయుట కొరకై ముందునకురికెను (10). ఆ రాక్ష సేశ్వరుడు దేవతలకు, రాక్షసులకు కూడా భయమును గొల్పు గొప్ప నాదమును చేసెను. దానిని విన్న వారి చెవులు పగిలినవి(11). జలంధరాసురుని భయంకరమగు గొప్ప నాదముచే నిండిపోయిన జగత్తు అంతయు ఆ సమయములో కంపించెను (12). అపుడు విష్ణువునకు, ఆ రక్షసరాజునకు మధ్య గొప్ప యుద్ధము జరిగెను. వారు ఆకాశమునంతనూ లేశ##మైననూ అవకాశము లేని విధముగా బాణములతో నింపి వేసిరి (13). ఓ మహర్షీ! వారి ద్వంద్వయుద్ధమును గాంచిన దేవతలు, రాక్షసులు, మహర్షులు, సిద్ధులు సరమాశ్చర్యమును పొందిరి (14).

విష్ణుర్దైత్యస్య బాణౌఘైర్ధ్వజం ఛత్రం ధనుశ్శరాన్ | చిచ్ఛేద తం చ హృదయే బాణ   నైకేన తాడయన్ || 15

తతో దైత్యస్సముత్పత్య గదాపాణిస్త్వరాన్వితః | ఆహత్య గరుడం మూర్ధ్ని పాతయామాస భూతలే || 16

విష్ణుం జఘాన శూలేన తీక్ష్ణేన ప్రస్ఫురద్రుచా | హృదయే క్రోధ సంయుక్తో దైత్యః ప్రస్ఫురితాధరః || 17

విష్ణుర్గదాం చ ఖడ్గేన చిచ్ఛేద ప్రహసన్నివ | తం వివ్యాధ శ##రైస్తీక్ష్ణైశ్శార్ఙ్గం విస్ఫార్య దైత్యహా || 18

విష్ణుర్జలంధరం దైత్యం భయదేన శ##రేణ హ | క్రోధావిష్టో%తితీక్ష్ణేన జఘానాశు సురారిహా || 19

ఆగతం తస్య తం బాణం దృష్ట్యా దైత్యో మహాబలః | ఛిత్వా బాణ   న విష్ణుం చ జఘాన హృదయే ద్రుతమ్ || 20

కేశవో%పి మహాబాహుః విక్షిప్తమసురేణ తమ్ | శరం తిల ప్రమాణ   న ఛిత్వా వీరో ననాద హ || 21

విష్ణువు అనేక బాణములను ప్రయోగించి ఆ రాక్షసుని ధ్వజమును, ఛత్రమును, ధనుస్సును, బాణములను ఛేదించి, అతనిని హృదయముపై ఒక బాణముతో కొట్టెను (15). అపుడు ఆ రాక్షసుడు గదను చేతబట్టి వేగముగా పైకి లంఘించి గరుడుని తలపై మోది నేలపై పారవైచెను (16). కోపముతో వణుకుచున్న క్రింది పెదవి గల ఆ రాక్షసుడు గొప్ప ప్రకాశము గలది, వాడియైనది అగు శూలముతో విష్ణువును హృదయునందు పొడిచెను (17). రాక్షస సంహారకుడగు విష్ణువు చిరునవ్వు గలవాడై కత్తితో గదను విరుగకొట్టి శార్ఙ్గధనస్సును ఎక్కుపెట్టి వాడి బాణములతో వానిని కొట్టెను రాక్షస సంహారకుడగు విష్ణువు క్రోధావేశమును పొంది మిక్కిలి వాడియగు భయంకరమైన బాణముతో జలంధరాసురుని శీఘ్రముగా నొప్పించెను (19). మహాబలవంతుడగు ఆ రాక్షసుడు విష్ణువుచే ప్రయోగింపబడి మీదకు వచ్చుచున్న ఆ బాణమును గాంచి, దానిని మరియొక బాణముతో ఛేదించి వెంటనే విష్ణువును వక్షస్థ్సలముపై గొట్టెను (20). మహాబాహుడు, వీరుడు అగు విష్ణువు కూడా రాక్షసునిచే ప్రయోగింప బడిన ఆ బాణమును నువ్వగింజ ప్రమాణములో నుగ్గు చేసి సింహనాదమును చేసెను (21).

పునర్బాణం సమాధత్త ధనుషి క్రోధ వేపితః | మహాబలో%థ బాణ   న చిచ్ఛేద స శిలీముఖమ్ || 22

వాసుదేవః పునర్బాణం నాశాయ విబుధద్విషః | క్రోధేనాధత్త దనుషి సింహవద్వ్యనదాద హ || 23

జలంధరో%థ దైత్యేంద్రః కోపచ్ఛిన్నాధరో బలి | శ##రేణ స్వేన శార్ఙ్గాఖ్యం దనుశ్ఛిచ్ఛేద వైష్ణవమ్ || 24

పునర్బాణై స్సుతీక్ష్ణైశ్చ జఘాన మధుసూదనమ్ | ఉగ్రవీర్యో మహావీరో దేవానాం భయంకారకః || 25

స చ్ఛిన్నధన్వా భగవాన్ కేశవో లోకరక్షకః | జలంధరస్య నాశాయ చిక్షేప స్వర్గదాం పరామ్ || 26

సా గదా హరిణా క్షిప్తా జ్వలజ్జ్వలన సన్నిభా | అమోఘగతికా శీఘ్రం తస్య దేహే లలాగ హ || 27

తయా హతో మహాదైత్యో న చచాలాపి కించన | జలంధరో మదోన్మత్తః పుష్పమాలాహతో యథా || 28

మహాబలుడగు జలంధరుడు కోపముతో వణుకుచున్నవాడై ధనస్సు నందు మరల బానములను సంధించగా, విష్ణువు దానిని కూడ విరుగగొట్టెను (22). వాసుదేవుడు దేవశత్రువగు జలంధరుని సంహరించ గోరి కోపముతో మరల బాణమును ధనస్సు నందు సంధించి సింహనాదమును చేసెను (23). రాక్షసరాజు, బలశాలి యగు జలంధరు అపుడు కోపముతో పెదవిని కొరికి తన బానముతో విష్ణువు యొక్క శార్ఙ్గధనస్సును విరుగగొట్టెను (24). భయంకరమగు పరాక్రమము గలవాడు, మహావీరుడు, దేవతలకు భయమును గొల్పువాడు నగు జలంధరుడు మరల మధుసూదనుని మిక్కిలి వాడియగు బాణముతో కొట్టెను (25). లోకములను రక్షించే కేశవభగవానుడు విరిగిన ధనస్సు గలవాడై జలంధరుని సంహరించుటకై దివ్యమగు గదను ప్రయోగించెను (26). మండే అగ్నిని బోలియున్నది, అమోఘమగు గతి కలది అగు ఆ గద విష్ణువచే ప్రయోగింపబడి వెంటనే అతని దేహమునకు తగిలెను (27). బలముతో గర్వించినవాడు, మహారాక్షసుడునగు జలంధరునకు ఆ గత పుష్పమాలవలె తగిలి, లేశ##మైననూ అతనిని కదిలించలేక పోయెను (28).

తతో జలంధరః క్రోధీ దేవత్రాసకరో%క్షిపత్ | త్రిశూల మనలాకారం హరయే రణదుర్మదః || 29

అథ విష్ణుస్త త్రి శూలం చిచ్ఛేద తరసా ద్రుతమ్ | నందకాఖ్యేన ఖడ్గేన స్మృత్వా శివపదాంబుజమ్ || 30

ఛిన్నే త్రిశూలే దైత్యేంద్ర ఉత్ప్లుత్య సహసా ద్రుతమ్ | ఆగత్య హృదయే విష్ణుం జఘాన దృఢముష్టినా || 31

సో%పి విష్ణుర్మహా వీరో% విగణయ్యైచ తద్ వ్యథామ్ | జలంధరం చ హృదయే జఘాన దృఢముష్టినా || 32

తతస్తౌ బాహూయుద్ధేన యుయుధాతే మహాబలౌ | బాహుభిర్ముష్టిభిశ్చైవ జానుభిర్నాదయన్మహీమ్ || 33

ఏవం హి సుచిరం యుద్ధం కృత్వా తేనాసురేణ వై | విస్మితో%భూన్మని శ్రేష్ఠ హృది గ్లాని మవాప హ || 34

అథ ప్రసన్నో భతవాన్మాయీ మాయా విదాం వరః | ఉవాచ దైత్యరాజానం మేఘగంభీరయా గిరా || 35

యుద్ధములో సహింప శక్యము కాని పరాక్రమము గలవాడు, దేవతలకు భయమును గొల్పువాడునగు జలంధరుడు అపుడు కోపించి అగ్ని హోత్రమువలె మిరుమిట్లు గొల్పు చున్న త్రిశూలమును విష్ణువు పైకి విసిరెను (29). అపుడు విష్ణువు శివుని పాదపద్మములను స్మరించి వెంటనే నందకమను ఖడ్గముతో ఆ త్రిశూలమును ముక్కలు చేసెను (30). త్రిశూలము ముక్కలు కాగానే, ఆ రాక్షసవీరుడు వెంటనే పైకి దుమికి వచ్చి విష్ణువును బలమగు పిడికిలతో వక్షస్థలముపై కొట్టెను (31). మహావీరుడగు ఆ విష్ణువు కూడా ఆ బాధను లెక్కచేయక, బలమగు పిడికిలితో జలంధరుని వక్షస్థ్సలముపై కొట్టెను (32). అపుడు వారద్దరు మహాబలులు చేతులతో పిడికిళ్లతో మోకాళ్లతో మల్ల యుద్ధమును చేసిరి. ఆ శబ్దముతో భూమి ప్రతిధ్వనించెను (33). ఓ మహర్షీ! విష్ణువు చిరకాలము ఆ రాక్షసునితో యుద్ధమును చేసి ఆశ్చర్యమును పొందినవాడై మనస్సులో క్లేశమును, అలసటను పొందెను (34). మాయను ఎరింగిన వారిలో శ్రేష్ఠుడు, మాయకు

ఆధీశ్వరుడు అగు విష్ణుభగవానుడు అపుడు ప్రసన్నుడై. ఆ రాక్షసరాజును ఉద్దేశంచి మేఘంగంభీరమగు స్వరముతో నిట్లనెను (35).

విష్ణురువాచ |

భో భో దైత్యవర శ్రేష్ఠ ధన్యస్త్వం రణదుర్మదః |
మహాయుధవరైర్యత్త్వంన భీతో హి మహాప్రభుః || 36

ఏభిర్దేవాయుధైరుగ్రైర్దైత్యా హి బహవో హతాః | మహౌజా దుర్మదా
వీరాశ్ఛిన్న దే హా మృతిం గతాః || 37

యుద్ధేన తే మహాదైత్య ప్రసన్నోఽస్మి మహాన్ భవాన్ | న
దృష్టస్త్వత్సమో వీరసై#్రలోక్యే సచరాచరే || 38

వరం వరయ దైత్యేంద్ర ప్రీతోఽస్మి తవ విక్రమాత్ | అదేయమపి తే
దద్మి యత్తే మనసి వర్తతే || 39

విష్ణువు ఇట్లు పలికెను-

ఓయీ! రాక్షసశ్రేష్ఠా! యుద్ధములో సహింప శక్యము గాని పరాక్రమము గల నీవు ధన్యుడవు. ఏలయన, మహాప్రభుడవగు నీవు గొప్ప ఆయుధములకైననూ భయపడుట లేదు (36). క్రూరములగు ఇవే ఆయుధములను ప్రయోగించగా గొప్ప బలము, తేజస్సు గల వీరులైన రాక్షసులు చాలామంది తెగిన దేహములు గలవారై మృతిని చెందిరి (37). ఓ గొప్ప రాక్షసుడా! నీ యుద్ధముచే నేను ప్రసన్నుడనైతిని. నీవు మహాత్ముడవు. స్థావర జంగమాత్మక మగు ముల్లోకములలో నీతో సమమగు వీరుడు కానరాడు (38). ఓ రాక్షసరాజా! వరమును కోరుకొనుము. నీ విక్రమమునకు నేను సంతసించితిని. నీకు ఈయరాని వరమునైననూ ఇచ్చెదను. నీ మనసులోని మాటను బయటపెట్టుము. (39).

సనత్కుమార ఉవాచ |

ఇత్యాకర్ణ్య వచస్తస్య విష్ణోర్మాయావినో హరేః | ప్రత్యువాచ
మహాబుద్ధిర్దైత్యరాజో జలంధరః || 40

సనత్కుమారుడిట్లు పలికెను -

మాయను వశము చేసుకొన్నవాడు, పాపములను పోగొట్టువాడు అగు ఆ విష్ణువుయొక్క ఈ మాటను విని మహాబుద్ధిశాలి, రాక్షసుడునగు జలంధరుడు ఇట్లు బదులిడెను (40).

జలంధర ఉవాచ |

యది భావుక తుష్టో%సి వరమేతం దదస్వమే | మద్భగిన్యా మయా సార్ధం మద్గేహే సగణో వస || 41

జలంధరుడిట్లు పలికెను-

బావా! నీవు సంతుష్టుడవైనచో, నాకీ వరమునిమ్ము. నీవు నీ గణములతో, మరియు మా చెల్లెలితో గూడి నా ఇంటిలో నివసించుము (41).

సనత్కుమార ఉవాచ |

తదాకర్ణ్య వచస్తస్య మహాదైత్యస్య ఖిన్నధీః | తథాస్త్వితి చ దేవేశో జగాద భగవాన్ హరిః ||42

ఉవాస స తతో విష్ణుస్సర్వదేవగణైస్సహ | జలంధరం నామ పురమాగత్య రమయా సహ || 43

అథో జలంధరో దైత్యస్స్వ భగిన్యా చ విష్ణునా | ఉవాస స్వాలయం ప్రాప్తో హర్షాకులితమానసః || 44

జలంధరో%థ దేవానా మధికారేషు దానవాన్ | స్థాపయిత్వా సహర్షస్సన్ పునరాగాన్మహీతలమ్ || 45

దేవగంధర్వ సిద్ధేషు యత్ కించిద్రత్న సంచితమ్ | తదాత్మ వశగం కృత్వా%తిష్ఠ త్సాగరనందనః || 46

పాతాలభవనే దైత్యం నిశుంభం సుమహాబలమ్ | స్థాపయిత్వా స శేషాదీనానయద్భూతలం బలీ || 47

సనత్కుమారుడిట్లు పలికెను-

ఆ మహారాక్షసుని ఈ మాటను విని దేవదేవుడు, పాపహారియగు విష్ణుభగవానుడు భేదముతో నిండిన మనస్సు గలవాడై 'అటులనే యగుగాక!' అని పలికెను (42). తరువాత విష్ణువు దేవగణములందరితో, మరియు లక్ష్మీదేవితో గూడి జలంధరమను నగరమునకు వచ్చి నివసించెను (43). అపుడు ఆ జలంధరాసురుడు తన సోదరియగు లక్ష్మితో మరియు విష్ణువుతో గూడి తన ఇంటికి చేరి ఆనందముతో నిండిన మనస్సు గలవాడై నివసించెను (44). అపుడు జలంధరుడు దేవతల అధికారపదవులలో రాక్షసులను నియమించి ఆనందముతో భూమండలమునకు మరలి వచ్చెను (45). సముద్రతనయుడగు జలంధరుడగు దేవగంధర్వ సిద్ధుల వద్ద గల శ్రేష్ఠవస్తువుల నన్నిటినీ స్వాధీనమొనర్చు కొనెను (46). బలవంతుడగు జలంధరుడు పాతాళభవనమునందు మిక్కిలి బలశాలియగు నిశుంభుని స్థాపించి, శేషుడు మొదలగు వారిని భూమండలమునకు తీసుకువచ్చెను (47).

దేవగంధర్వ సిద్ధౌఘాన్ సర్పరాక్షసమానుషాన్ |స్వపురే నాగరాన్ కృత్వా శశాస భువనత్రయమ్|| 48

ఏవం జలంధరః కృత్వా దేవాన్ స్వవశవర్తినః | ధర్మేణ పాలయామాస ప్రజాః పుత్రానివౌరసాన్|| 49

న కశ్చిద్వ్యాధితో నైవ దుఃఖితో న కృశస్తథా | న దీనో దృశ్యతే తస్మిన్ ధర్మాద్రాజ్యం ప్రశాసతి|| 50

ఇతి శ్రీ శివ మహాపురాణ    రుద్రసంహితాయాం యుద్ధఖండే విష్ణు జలంధరయుద్ధవర్ణనం నామ సప్తదశో%ధ్యాయః(17).

ఆతడు దేవ గంధర్వ సిద్ధ సమూహములను, నాగరాక్షసమనుష్యులను తన నగరములో పౌరులుగా చేసుకొని ముల్లోకములను శాసించెను (48). జలంధరుడు ఈ తీరున దేవతలను తన వశము చేసుకొని, ప్రజలను స్వంతబిడ్డలను వలె

రక్షించి, ధర్మబద్ధముగా రాజ్యము నేలెను (49). ఆతడు ధర్మముతో రాజ్యము నేలుచుండగా, రాజ్యములో వ్యాధిగ్రస్తులుగాని, దుఃఖితులు గాని, క్రుంగి కృశించినవారు గాని, దీనులు గాని ఒక్కడైననూ కానరాలేదు (50).

శ్రీ శివమహాపురాణములో రుద్ర సంహితయందు యుద్ధఖండలో విష్ణు జలంధర యుద్ధ వర్ణనమనే పదునేడవ అధ్యాయము ముగిసినది (17).